# ఆత్మషట్కము–5

## శ్రీ శంకరాచార్యులవారు

నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో
దేహస్యోక్తాః ప్రాకృతా స్సర్వధర్మాః
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహం
కారస్యైవ హ్యాత్మనో మే శివోఽహమ్.

తా॥ నేను యథార్థముగ పుట్టుటలేదు. వృద్ధినొందుటలేదు. నశించుటలేదు. ప్రకృతి ధర్మములన్నియు దేహమునకు జెందినవేయగును. చిన్మయాత్మనగు నాకు కర్తృత్వాదులు గాని, అహంకారముగాని లేవు. నేను శివరూప పరమాత్మయే అయి విలసిల్లుచున్నాను.

వ్యాఖ్య :– ఈ శ్లోకమున ఆత్మానుసంధానమెట్లు కావించవలెనో, చక్కగ చెప్పబడినది. పరమార్థ సాధకుడు తానెల్లపుడు చావుపుట్టుకలు లేని ఆత్మయే అయియున్నాడనియు దేహాదిరూప ఉపాధి తాను కాదనియు, తాను దేహమునకు సాక్షిగా విలసిల్లుచున్నాడనియు, తాను నిత్య శుద్ధ ముక్త చిదాత్మయే అయియున్నాడనియు బాగుగ మననముచేసి అట్టి ఆత్మయందే సదా స్థితిగలిగియుండవలెను.

ఓం




సంపుటము : 24 సెప్టెంబరు 1992 సంచిక 9

## సంపాదకవర్గము

గౌరవ సంపాదకులు :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి M.A.,D.Litt. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య M. A.

| | |
|---|---|
| సంపాదకులు : | బి. ఈశ్వర్ |
| సహాయ సంపాదకులు : | బోధచైతన్య,M.A. ఓంప్రకాశ్ B.Sc. |
| సంవత్సర చందా : | రూ. 30/–లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ-520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/–లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి-517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |

**చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.**

# వేదాంతభేరి

అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**

## విషయసూచిక



ముఖచిత్రము :

కొలిచినవారిని కాపాడే కరుణామయీ!
నవదుర్గాస్వరూపిణీ! సింహవాహినీ!
దుష్టసమ్మర్దినీ! శిష్టసంరక్షణీ! కనకదుర్గా జననీ!
శిరసా మనసా వాచా నమామి.

# ప్రార్థన



## కృష్ణ ప్రార్థన

ఓమ్ ఫుల్లేన్దీవరకాన్తిమిన్దువదనం బర్హావతంసప్రియం
శ్రీవత్సాఙ్కముదారకౌస్తుభధరం పీతామ్బరం సున్దరమ్
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతం
గోవిన్దం కలవేణునాదనిరతం దివ్యాఙ్గభూషం భజే.

వికసించిన నల్లకలువల యొక్క కాంతిగలవారును, చంద్రుని వంటి ముఖముగలవారును, నెమలిపింఛమును శిరోభూషణమే ఇష్టమైనదిగా గలవారును, శ్రీవత్సమనెడు పుట్టుమచ్చగలవారును, గొప్పదియగు కౌస్తుభమను మాణిక్యమును ధరించినవారును, పీతాంబరధారియు, సుందరమైనవారును, గోపికలయొక్క నేత్రములను కలువపువ్వులచే బూజింపబడిన దేహముగలవారును, గోవుల యొక్కయు, గోపాలురయొక్కయు సమూహములచే జుట్టబడినవారును, మధుర వేణునాద వినోదుడును, దివ్యాలంకారనుశోభితులును, గోవిందుడునునగు శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించుచున్నాను.



# వివేకానంద శంఖారావము

Isolation of the soul from all objects, mental and physical, is the goal; when that is attained, the soul will find that it was alone all the time, and it required no one to make it happy. As long as we require someone else to make us happy we are slaves.

ఆత్మ శారీరక, మానసిక పదార్థము లన్నిటి నుండి వేఱైపోవుటయే లక్ష్యము. అట్టి స్థితి సంభవించినపుడు ఆత్మ తాను అంతవఱకు ఏకాకిగానె ఉన్నదనియు, తాను సుఖమునొందుటకు మఱియొక వస్తువుతో పనిలేదనియు తెలిసికొనును. మనకు సుఖము కలుగజేయుటకు "మఱియొక వస్తువుతో" అవసరమున్నంతవఱకు మనము బానిసలమే అగుదుము.

OO

# వేదాంతభేరి



## నియమపాలన

### శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



నియమ ప్రకారము సూర్యుడు ఉదయించుచున్నాడు. అస్తమించుచున్నాడు. చంద్రుడు, నక్షత్రములు తమ తమ నియమముల ప్రకారము సరిగా గమనము సల్పుచున్నవి. వసంతకాలము రాగానే చెట్లు చిగురించుచున్నవి. గ్రీష్మర్తువునందు తాపమధికరించుచున్నది. ప్రతి సంవత్సరము ఆ యా ఋతువులందు నియమప్రకారము ఆ యాకార్యములు జరుగుచున్నవి. ప్రకృతియంతయు నియమబద్ధముగ వర్తించుచున్నది.విశ్వమును చక్కగ పరీక్షించి చూచినచో ఈ నియమపాలనమును ధర్మము కొట్టవచ్చినట్లు కనుపించును.

మఱి మానవుడు సద్గతిని పొందవలెననిన ఈ నియమపాలనము అవసరము లేదా? ప్రకృతి బోధించు ఈ అపూర్వ ధర్మమును మానవుడు ఎన్నటికిని విస్మరించరాదు, ఉపేక్షించరాదు. "న శ్రేయో నియమం వినా" —నియమము లేనిచో శ్రేయస్సు కలుగదు— అని పెద్దల వాక్యము. వ్యక్తికి గాని, సంఘమునకుగాని, జాతికిగాని నియమములేనిదే అభివృద్ధియే లేదు.

పశువు పుట్టినపుడు ఎటులుండునో చనిపోవునపుడును అటులనే యుండును. సింహము పుట్టినపుడు క్రూరముగా నుండును. చచ్చినపుడు అట్లే యుండును. మార్పు వుండదు. స్వభావమునందుగాని, సంస్కారమునందుగాని, వాటికి అభివృద్ధియే కానుపించదు. మానవుడును అట్లుండినచో ఇక మానవత్వముయొక్క ఆధిక్యత ఏమి? ఎనుబది నాలుగు లక్షల జీవరాసులలో మానవుని యొక్క ప్రత్యేకత ఏమి? స్వభావము మారవలెను. సంస్కారమునందు అభివృద్ధి గోచరించవలెను. మానవుడు మాధవుడుగా మారవలెను. అట్టు మారుచున్నాడా? లేదు. పైపెచ్చు దిగజారి దానవుడుగా పరిణమించుచున్నాడు.

మానవుడు తనకు భగవానుడు సృష్టిలో అత్యంత సమున్నత స్థానమును ప్రసాదించెనని భావించి జీవితమును నియమబద్ధముగా గావించుకొని ఇంకను సమున్నతిని బడయుటకై తీవ్రతర ప్రయత్నమాచరించవలెను. బహుజన్మార్జిత ప్రాపంచిక వాసనల ననుసరించి మనస్సు వక్రమార్గమున జనుచుండును. అసుర మార్గమున పయనించుచుండును. పరమార్థ నియమము, సదనుష్ఠానము అను త్రాటిచే దానిని బంధించి పరమాత్మయందు స్థాపితమగునట్లు చూడవలెను. కొన్ని కొన్ని చక్కని నియమము లేర్పరచుకొని వాటిని జీవితమందు ఆచరణయందుంచుకొనవలెను.

ప్రతిదినము ఉషఃకాలమున బ్రహ్మముహూర్తమందు నిద్ర లేచుట, స్నాన సంధ్యా జపతప ప్రార్థనాదులను గావించుట, సద్గ్రంథ పఠన మొనర్చుట, శక్తికొలది బీదలకు సహాయము చేయుట, నిత్య జీవితమునందు ఏ విధమైన పాపకార్య మాచరింపకుండుట, మరల రాత్రి పరుండబోవునపుడు భగవద్ధ్యాన మాచరించుట మొదలగు నియమములను మానవుడు ఆచరణయందుంచుకొనవలెను.

ఈ నియమములన్నిటిలోను దైవచింతనమునకు ప్రాధాన్య మతి

మనుష్యుడు. తన్ను సృష్టించి, తనకు ఆయురారోగ్యములను ప్రసాదించి, మోక్షమునకు పరమయోగ్యమైనట్టి మానవజన్మను అనుగ్రహించి ఎన్నియో అనుకూలములను గావించుచున్న పరమేశ్వరునకు మానవుడు మహో కృతజ్ఞుడై నిద్ర లేవగనే ప్రప్రథమమున అమ్మహనీయుని సంస్మరించవలెను. మరల అవకాశమును కలుగజేసికొనుచు నిత్యజీవితమందు ప్రార్థనాదులను గావించుచుండవలెను.

ప్రార్థన చేయనిదే, దైవచింతన ఒనర్చనిదే భోజనముగాని, ఉపాహారముగాని తాకగూడదను నియమమును ఏర్పరుచుకొనవలెను. ఎన్ని పనులున్నప్పటికిని భోజనమును ఎవరును వదలరుగదా! అట్లే ప్రార్థనను, దైవధ్యానమునుగూడ వదలరాదు. అన్ని నియమములందును ఈ నియమము చాలా ముఖ్యమైనది.

ఇక రెండవది ధర్మాచరణము. ఒక చెంప ప్రార్థనాదులను చేయుచు వేఱొకప్రక్క ధర్మమునకు విరుద్ధమైన ఆచరణ చేయుచుండినచో, పరులను బాధించుచుండినచో, అన్యాయము, అవినీతి జరుపుచుండినచో, చీకటిమార్గమున పయనించుచుండినచో అది సరికాదు. భగవంతుడు ధర్మస్వరూపుడు. 'ధర్మసంస్థాపనార్థాయ'– అనునట్లు ధర్మోద్ధరణ కొఱకే యాతడు అవతరించుచుండును.

కాబట్టి భగవంతునకు అతి ప్రియమైన ధర్మమును దూరీకరించి, ధిక్కరించి, దేవుని చింతన జేయుచుండినచో ఆ దైవచింతనకు అర్థమేలేదు. దానికి విలువేయుండదు. కాబట్టి దైవచింతనతోబాటు ధర్మాచరణ కూడ జీవుడు తప్పక కలిగియుండవలెను.

ఈ ప్రకారముగ మానవుడు జీవితమును నియమబద్ధముగావించుకొని, సృష్టిలో తనకొసంగబడిన మహోన్నత స్థానమును సార్థకపఱచుకొని, తన్ను తాను సంస్కరించుకొని భగవత్కరుణకు పాత్రుడై తరించవలెను. ○○

# "పితృదేవోభవ"

## శ్రీ మేడేపల్లె కుల్లాయప్ప చౌదరి గారు (బొప్పేపల్లె)

తే॥గీ॥ పితరుల ఋణంబుఁదీర్చ్చ సం - తతిని గోరి
మాననీయ గృహస్థాశ్ర - మమును బొంది
జాతి నెప్పుడు చెడకుండ - జగతి నిల్పు
తండ్రికంటెను దేవుఁడు - ధరణిలేఁడు.

తే॥గీ॥ తృప్తినిసుమంతఁగానక రా - త్రిం బవళ్ళు
కాయ కష్టముఁజేసి, తాఁ - గనిన సుతుల
భాగ్యవంతుల సేయగా - పరితపించు
తండ్రికన్నను దేవుండు - ధరణిలేఁడు.

తే॥గీ॥ దేహధారణఁగావించు - దేవుఁడగుచు
త్రిభువనంబుల సృష్టి నొం - దించునతఁడు
జగతి నిలవెట్టు నతఁడును - జనకుఁడగుట
తండ్రికంటెను దేవుఁడు - ధరణిలేఁడు. 3

తే॥గీ॥ వోర్పున ధరిత్రినిం బోలి నేర్పులోడ
గృహమునందలి జనులను - విహితమతులఁ
జేసి, ఉత్తమ పదంబును - జేర్చునట్టి
తండ్రికన్నను దేవుండు - ధరణిలేఁడు. 4

తే॥గీ॥ భవములకు హేతువైనట్టి - ప్రకృతివలన
విశ్వసృష్టిని గావించు - ఈశ్వరు క్రియ
ప్రకృతి ప్రతినిధియైన య - ర్ధాంగివలన
ప్రజల సృష్టించి లోక వ - ర్తనము నిల్పు
తండ్రికంటెను దేవుఁడి - ద్ధరణిలేఁడు. 5

తే॥గీ॥ వరుస పదునాల్గు భువనముల్ - ప్రాణరూపు
లైన తనువులఁదాల్చు వా - రగుట చేత
తనువులన్నిచ్చు నాతండు - తండ్రియగుట
తండ్రి ప్రత్యక్ష దేవుఁడి - ద్ధరణిలోన. 6

సూచన: ప్రతి పద్యములోని ఆద్యక్షరముల నొకచో కూర్చిన "పితృదేవోభవ" అన్న ఈ శీర్షికా నామము సిద్ధించుచున్నది. ఓం తత్సత్.

# ధర్మం శరణం గచ్ఛామి

## భిక్షు సారిపుత్రుని కథ

శ్రీ బోధచైతన్య గారు

ఉపతిస్స, కొలిత అనేవి ప్రక్క ప్రక్క గ్రామాలు. ఆ గ్రామాల పరిసరాల్లో ఒక ఇంద్రజాల ప్రదర్శన జరిగింది. ఉపతిస్స నుండి సారిపుత్రుడు, కొలితనుండి మౌద్గలాయనుడు ఆ ప్రదర్శనను చూడడానికి వెళ్ళారు. వారిద్దరూ స్నేహితులు. ఆ ప్రదర్శన చూశాక ఈ ప్రపంచం కూడా ఇంద్రజాలం లాంటిదే అనే భావన వాళ్ళిద్దరూ కలిగించుకొన్నారు. ముక్తిమార్గాన్వేషణ చేయాలని సంకల్పించారు.

అప్పుడు చాలా ప్రసిద్ధుడుగా రాజగృహ నగరానికి చెందిన సంజయుడనే పరివ్రాజకుండేవాడు. ఆ ఇద్దరు యువకులు ఆయన దగ్గరకు వెళ్ళారు. ఆయన బోధించిన అజ్ఞేయవాదం (Agnasticism) వీళ్ళకు రుచించలేదు. ఆయన్ను వదలిపెట్టి భరతఖండమంతా సంచారం చేశారు. సరైన మార్గం బోధించేవాళ్ళు గోచరించలేదు. ఇక ఇద్దరూ వేరు వేరు దిక్కుల్లో అన్వేషణ సాగించాలనే నిశ్చయానికి వచ్చి ఒక ఒప్పందాన్ని కుదుర్చుకొన్నారు– ఎవడు ముందు సరైన మార్గాన్ని తెలుసుకుంటాడో అతడు మరొకతనికి వెంటనే దాన్ని తెలుపవలెనని.

ఆ పిమ్మట ఒకనాడు సారిపుత్రుడు అస్సజీ అనే బౌద్ధభిక్షువును కలిశాడు. ఆయన ఈ యువకుని తీవ్రముముక్షుత్వానికి ముగ్ధుడై తాను బుద్ధదేవుని చరణ సన్నిధిలో విన్న ముక్తిధర్మాన్నంతా తెలియజెప్పి "యే ధర్మా హేతుప్రభవా హేతుం తేషాం తథాగతోహ్యవదత్. తేషాం చ యో నిరోధ, ఏవం వాదో మహా శ్రమణః" అని ముగించాడు.

ఆ దివ్యబోధ విని సారిపుత్రుడు ఉప్పొంగిపోయాడు. ముక్తిమార్గం గోచరించింది. మిత్రునికి తానిచ్చిన మాటను గుర్తుకుతెచ్చుకొని అతణ్ణి వెదకి పట్టుకొని తాను

విన్న ముక్తిమార్గాన్ని వినిపించాడు. మౌద్గలాయనుడు కూడా ఆ ధర్మాన్ని విని పరమసంతోషాన్ని పొందాడు. ఆ పిమ్మట ఇద్దరూ తమ ప్రథమ గురువును జ్ఞప్తికి దెచ్చుకొని ఆయన దగ్గరకు వెళ్ళి ఇలా అన్నారు : "జరామరణ యోగం నుండి బైటపడే మార్గాన్ని బోధించే గురువును మేము కనుక్కొన్నాము. బుద్ధుడు భువియందు అవతరించియున్నాడు. ధర్మం అవతరించియున్నది. సంఘం అవతరించియున్నది. రండి. మనమందరము ఆ జగద్గురువును ఆశ్రయించుదాము"

సంజయుడు అంగీకరించలేదు. "వేలకొలది మందికి గురువుగా వున్న నేను మరొకనికి శిష్యుడు కావడమంటే ఒక పెద్ద కుండ తటాలున చిట్టిముంతగా మారి పోవడంలా వుంటుంది! అంతేకాదు, ఈ లోకంలో వివేకులు చాలా కొద్దిమందే వున్నారు. ఎక్కువ శాతం వున్నది మూర్ఖులే. ఆ కొద్దిమంది వివేకులు బుద్ధుని దగ్గరకే వెళతారు. వెళ్ళనీ. మిగిలిన మూర్ఖజనాలు కోకొల్లలుగా శిష్యులుగా నా దగ్గర చేరుతారు. మీ దారిన మీరెళ్ళండి. నన్ను ఇలాగే వుండనీయండి" అని కొంత వెటకార ధోరణిలో అన్నాడు సంజయుడు.

ఆ పిమ్మట ఆ ఇద్దరు స్నేహితులు బుద్ధుని చరణకమలాలను ఆశ్రయించారు. అది జరిగిన ఏడవనాటికే మౌద్గలాయనుడు అర్హత్వాన్ని పొందాడు. మరో ఏడు రోజులకు సారిపుత్రుడు కూడా అర్హత్వాన్ని పొందాడు. ఈ ఇద్దరు శిష్యరత్నాలను బుద్ధుడు తన ప్రధాన శిష్యులుగా (అగ్రశ్రావకులుగా) నియమించాడు. ఒకప్పుడు వీరిద్దరి ప్రస్తావనతోబాటు సంజయుని ప్రస్తావన కూడా వచ్చినప్పుడు బుద్ధుడిలా అన్నాడు : "సంజయునిలో మిథ్యాగర్వం చోటుచేసుకోవడంవల్ల సత్యాన్ని సత్యంగా తెలుసుకోలేకపోతున్నాడు. అసత్యాన్ని సత్యంగా తెలుసుకొంటున్నాడు. ఈ స్థితిలోనే కొనసాగినంతకాలం అతను పరమార్థాన్ని గ్రహించలేడు" తన పలుకులకు ముగింపుగా క్రింది రెండు శ్లోకాలను కూడా పఠించాడు.

అసారే సారమతయః సారే చాసారదర్శినః
తే సారం నాధిగచ్ఛంతి మిథ్యా సంకల్ప గోచరాః

-ధర్మపదం 1-11

సారం చ సారతో జ్ఞాత్వా అసారం చ
తే సారం అధిగచ్ఛంతి

-ధర్మపదం 1-12

# నామసంకీర్తన



1. జయ హరి జయ హరి జయ హరి జై
శ్రీ హరి శ్రీ హరి శ్రీ హరి జై

2. జయ జయ శంకర జయ అభయంకర।
పార్వతివల్లభ శ్రీ శివశంకర
ఉమాపతే శివ శంకర శంకర – గంగాధరా జగదీశ్వర
ఈశ్వర॥

3. ప్రేమ ముదిత మన్‌సే కహో రామరామరామ్– శ్రీరామ
రామరామ్

పాప్ మిటే దుఃఖ్ కటే ఏక్ రామనామ్
భవసముద్ర సుఖద నావ ఏక రామనామ్
పరమశాంత సుఖనిధాన మంత్ర రామనామ్
నిరాధార్ కో ఆధార్ ఏక్ రామనామ్
పరమగోప్య పరమ దివ్య మంత్ర రామనామ్
సంత్ హృదయ సదా వసత ఏక్ రామనామ్
మాతాపితా బంధు సఖా సబ్ హి రామనామ్
భక్తజన్ కా జీవనధన ఏక్ రామనామ్॥ OO

ఓం
రోడ్డు స్థిరం – బండి అస్థిరం
తెరగుడ్డ స్థిరం – బొమ్మ అస్థిరం
నీవు స్థిరం – నీ దేహం అస్థిరం

# పుష్కలంగా పుణ్యాలనిచ్చే

# కృష్ణా పుష్కరం

ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారు (తిరుపతి)

ఈ సంవత్సరం కృష్ణానదికి పుష్కరకాలం. పుష్కరాలు జరిగే పన్నెండు రోజులు ప్రజలు తండోపతండాలుగా కృష్ణానదిలో స్నానాలు చేస్తుంటారు. పితృ దేవతలకు శ్రాద్ధాది కర్మలను నిర్వర్తిస్తుంటారు. సత్కాలక్షేపం చేస్తుంటారు. ఏమిటి కారణం? అసలు పుష్కరమంటే ఏమిటి? ఎందుకు ఈ సంవత్సరం కృష్ణానదికి పుష్కరం వచ్చింది? పుష్కరాల్లో ఎందుకు స్నానాలు చేయాలి? ఎందుకు పితృ దేవతల కోసం శ్రాద్ధాది కర్మలను ఈ సమయంలో ఆచరించాలి? ఈ ప్రశ్నలు ఈనాడు సమాజంలో చాలామందికి కలుగుతుంటాయి. ఈ అంశాలను గూర్చి సంగ్రహంగా తెలుసుకుందాం.

## పుష్కరం అంటే ఏమిటి?

ఒకప్పుడు తుందిలుడనేవాడు తపస్సుచేసి పరమేశ్వరుని జలరూపంలో శాశ్వత స్థానాన్ని సంపాదించాడు. జలాన్నే పుష్కరమంటారు. జలం జీవజాలాన్ని పోషించేది కాబట్టి దానికి పుష్కరమనే పేరు సార్థకమౌతున్నది. అష్టమూర్తి జలరూపాన్ని పొందిన తుందిలుడు పుష్కరుడైనాడు. అతడే జలాధిపతి. సకల పుణ్యతీర్థాలకు ప్రభువు. తరువాత కొంతకాలానికి బ్రహ్మ సృష్టి చేయడానికి జలం అవసరమైంది. పరమేశ్వరానుగ్రహంచేత పుష్కరుడు తన కమండలంలో వుండేటట్లు బ్రహ్మ వరాన్ని పొందాడు.

ఒకప్పుడు బృహస్పతి బ్రహ్మను గురించి తపస్సుచేసి జనజీవనాధారభూతుడైన పుష్కరుడు తన అధీనంలో వుండాలని కోరాడు. ప్రాణుల యోగక్షేమాలు చూసుకుంటూ వారిని చక్కగా బ్రతికించే బాధ్యత బృహస్పతికున్నది. కాబట్టి బ్రహ్మ ఒక ఏర్పాటు చేశాడు. బృహస్పతి మేషాది ద్వాదశరాసుల్లో ప్రవేశించేటప్పుడు పన్నెండు రోజులు, ఆయారాసులనుంచి వెళ్ళిపోయేటప్పుడు పన్నెండు రోజులు,

మిగతా రోజుల్లో మధ్యాహ్న కాలంలో రెండు ముహూర్తాల కాలం పుష్కరుడు బృహస్పతితో వుండాలని నిర్ణయించాడు.

ఇలా పుష్కరుడు బ్రహ్మతోను బృహస్పతితోను కలసివుండే ఏర్పాటు జరిగింది.

## పుష్కరాలు ఎప్పుడు వస్తాయి?

ఈ క్రింది శ్లోకాలు పుష్కరాలు ఏ ఏ నదులకు ఎప్పుడెప్పుడు వస్తుంటాయో తెలియజేస్తున్నాయి-

మేషే గంగా వృషే రేవా మిథునే చ సరస్వతీ ।
కర్కటే యమునా ప్రోక్తా సింహే గోదావరీ స్మృతా ॥
కన్యాయాం కృష్ణవేణీ చ కావేరీ ఘటకే స్మృతా ।
వృశ్చికే తామ్రపర్ణీ చ చాపే పుష్కరవాహినీ ॥
మకరే తుంగభద్రా చ కుంభే సింధునదీ స్మృతా ।
మీనే ప్రణితా చ నదీ గురోస్సంక్రమణే స్మృతా ।
పుష్కరాఖ్యో మునీనాంహి ప్రదేశోఽత్ర బుధైస్స్మృతః ।

పైన చెప్పినట్లు గురువు ఆయా రాసుల్లో ప్రవేశించినప్పుడు ఆయా నదులకు పుష్కర కాలంగా భారతీయులు పరిగణిస్తున్నారు. బృహస్పతి కన్యారాశిలో ప్రవేశించినప్పటినుంచి పన్నెండు రోజులు పుష్కరకాలంగా పరిగణింపబడుతున్నాయి. ఈ సమయంలో ఎన్నో తీర్థాలు కృష్ణానదిని ఆశ్రయించి వుంటాయి. కనుకనే ఆ రోజుల్లో స్నానాలు చేస్తారు. తర్పణాది శ్రాద్ధక్రియలు ఆ పర్వకాలంలో ఎన్నో రెట్లు ఫలితాలనిస్తాయి. అందుకనే పితృదేవతల తృప్తికోసం ఆ రోజుల్లో శ్రాద్ధాదికర్మల నాచరిస్తారు.

## పుష్కర స్నానం

పుష్కర కాలంలో కృష్ణానదిలో స్నానంచేస్తే గంగాస్నానానికి కోటిరెట్లు ఫలితాన్నిస్తుందని ధర్మశాస్త్రం ఇలా చెబుతున్నది-

**భూతలే యాని తీర్థాని తాని కన్యాగతే గురౌ ।
ఆయాంతి కృష్ణవేణీం తు మహాపుణ్యఫలాయ చ ।
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఇంద్రాద్యాస్సర్వదేవతాః ।
పితరో ఋషయశ్చైవ తత్రైవ నివసంతి హి ।
కృష్ణాయాః పుష్కరే కృత్వా స్నానం దానం చ పైతృకమ్ ।
గంగాయాం కోటిగుణితం ఫలమాప్నోతి మానవః ।**

పుష్కరం మహాపర్వకాలం. పర్వమంటే ఎన్నో అర్థాలున్నా ఇక్కడ రెండు ప్రత్యేక కాలాల సంధికాలం అని అర్థం చెప్పుకోవచ్చు. అలాంటి పర్వాలు ప్రతి సంవత్సరం ఎన్నో వస్తుంటాయి. కాని పన్నెండుసంవత్సరాలకొకసారి వచ్చే పుష్కరం మహాపర్వకాలం. ఈ కృష్ణా పుష్కరసమయంలో భూమండంలోని తీర్థాలన్నీ కృష్ణానదిలో ప్రవేశిస్తాయి. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు మొదలగు దేవతలందఱు, పితరులు, ఋషులు కూడా ఈ పుణ్యసమయంలో కృష్ణానదిలో సన్నిధానులై వుంటారు. అందువల్ల స్నానం, దానం, పితృతర్పణం, శ్రాద్ధం పుష్కరకాలంలో చేస్తే అది గంగానదిలో చేసినదానికంటే కోటిరెట్లు ఫలితాన్నిస్తుంది.

కృష్ణవేణిలో స్నానం చేయడం కాదు దర్శనమాత్రం చేతనే మన పాపాలు నశిస్తాయని తీర్థ ప్రబంధం కృష్ణా మాహాత్మ్యాన్ని ఇలా పేర్కొంటున్నది-

నమామి సుకృత ప్రాణం కృష్ణవేణిం తరంగిణీం ।
యద్వీక్షణం కోటిజన్మకృత దుష్కృత శిక్షణమ్ ।

పుణ్యపరంపరలతో పరిఢవిల్లే ఏ నదిని దర్శించినంతమాత్రాన నరులు కోటి జన్మల్లో చేసిన పాపాన్ని పోగొట్టుకుంటారో అలాంటి కృష్ణవేణికి నమస్కరిస్తున్నాను.

పుష్కర స్నానం ఎంత విలక్షణమైందో మహాభారతం ఇలా వివరిస్తున్నది-

జన్మ ప్రభృతి యత్పాపం స్త్రియా వా పురుషేణ వా ।
పుష్కరే స్నాతమాత్రస్య సర్వమేవ ప్రణశ్యతి ।

స్త్రీగాని, పురుషుడుగాని పుట్టినప్పటినుంచి చేసిన పాపాలను ఒక్కసారి పుష్కరస్నానం చేసిన మాత్రాన పోగొట్టుకోవచ్చు. పుష్కరస్నానం అంత పవిత్రమైనది.

## పుష్కరస్నాన విధి

ఈ కృష్ణా పుష్కర కాలంలో ఎలా స్నానం చేయాలి? ఎప్పుడు చేయాలి? అనే విషయాలు స్పష్టంగా తెలుసుకుందాం.

పుష్కరకాలంలో ప్రాతఃకాలంలో నదిలో స్నానం చేయడం ఉత్తమం. మధ్యాహ్నం స్నానం చేయడం మధ్యమం. సాయంకాల స్నానం అధమమని ధర్మశాస్త్రం చెబుతున్నది. ముందురోజు ఉపవాసం చేసి మరుసటిరోజు పుష్కర స్నానంచేసి శ్రాద్ధ తర్పణాదులను చేయడం సంప్రదాయం. కేవల స్నానమే అయితే ఉపవాసం చేయనక్కఱలేదు. స్నానం చేసిన తరువాత త్రిమూర్తులకు ఇంద్రాది దేవతలకు అర్ఘ్యం ఇవ్వాలి. పితరులకు తర్పణాలు చేయాలి.

కృష్ణానదిలో స్నానం కోసం దిగబోయేముందు ఈ క్రింది మంత్రాన్ని మూడుసార్లు ఉచ్చరిస్తూ రేగిపండంత మట్టిని మూడుసార్లు వేయాలి.

[illegible]
[illegible]
స్నానం చేయడానికి ఈ క్రింది మంత్రంతో అనుజ్ఞతీసుకోవాలి-

స్నానం చేస్తూ ఈ మంత్రాన్ని మనస్సులో ధ్యానించాలి-

ఈ మంత్రంతో కృష్ణానదికి నమస్కారం చేయాలి-

కృష్ణానదికి తరువాత అర్ఘ్యం ఇస్తూ ఈ మంత్రం చెప్పాలి-
[illegible]
[illegible]
బృహస్పతికి అర్ఘ్యమివ్వడానికి ఈ క్రింది మంత్రం చెప్పాలి-
[illegible]
[illegible]
స్నానంచేసి పొడిబట్టలు కట్టుకొని ఇలా సూర్యధ్యానం చేయాలి-
ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణస్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః ।

కృష్ణవేణి నామస్మరణం వల్లనే ఏడేడు జన్మల్లో చేసిన పాపాలు పటాపంచలై పోతాయి. విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. అలాంటప్పుడు పుష్కరకాలంలో కృష్ణా స్నానం పుణ్యప్రదమనడంలో సందేహమేముంది?

కృష్ణవేణీతి యో బ్రూయాత్
సప్తజన్మార్జితాన్యపి ।
మహాపాపాని నశ్యంతి
విష్ణులోకం స గచ్ఛతి ।
"కృష్ణా ప్రతిహతతృష్ణా ముష్ణాతు యమాఘసంచయం సతతమ్"

OO

# సమభావము

సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసి
జానతామ్, సమానోమంత్ర స్సమితి స్సమానీ
సమానం మన స్సహ చిత్తమేషామ్ ।
సమానం మంత్రమభిమంత్రయే వః ॥
సమానీవ ఆకూతి స్సమానా హృదయాని వః ।
సమాన మస్తు వో మనో యథా వస్సు సహో సతి ॥

*ఒకటిగ చేరుడు; ఒకటిగ మాట్లాడుడు.*
*మీ మనస్సులు యేక రీతిగ గ్రహించుగాక!*
*మీ ప్రార్థన యేకరీతిగ నుండుగాక!*
*మీ సమితి ఉద్దేశ లక్ష్యములు ఒకే తీరుగ నుండుగాక!*
*మీ ప్రయోజనము ఒకటే అగుగాక!*
*మీ సంకల్పము ఒకే విధముగ నుండుగాక!*

*మీరు యేక నీతి సంపన్నులు కావలెనని నా సలహా, మీ కోర్కెలు సమానములగుగాక!*

*మీ హృదయములు అభిన్నమై యుండుగాక!*

*మీలో మీకు సంపూర్ణ సమైక్యత సిద్ధించు నిమిత్తము మీ ఉద్దేశ్యమొకటిగ నుండుగాక!*

**Be greatful to the poor for giving you the occasion of practising charity.**

**దానమును అభ్యసించుటకు నీకు చక్కని అవకాశమును కల్పించినందులకుగాను బీదవారి యెడల నీవు కృతజ్ఞుడవై యుండుము.**

# ఆత్మప్రాప్తికై పాటుపడండి!

## శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు (తిరుపతి)

*(అనపర్తిలో 1992 మార్చి 18, 19, 20 తేదీలలో జరిగిన 66వ సనాతన వేదాంత జ్ఞాన సభలో అధ్యక్షులు పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారి ప్రబోధం 18.3.92)*

ఇది 66వ సనాతన వేదాంత సభ. ఈ మహాసభలో పూర్తి నిశ్శబ్దత స్ఫురిస్తున్నది. ముముక్షువులు, జిజ్ఞాసువులు సభకు హాజరయ్యారు. Well begun is half-done–అంటారు. అంటే ఒక కార్యక్రమం చక్కగా ప్రారంభమయిందంటే సగం పూర్తయినట్లే అని అర్థం.

కృష్ణుడు గీతోపదేశం చేసిన పిమ్మట "కచ్చి దేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా"– "అర్జునా! ఏకాగ్రమైన చిత్తంతో ఇది విన్నావా?" అని ప్రశ్నించాడు–గురువు గారి బోధను శిష్యుడు ఏకాగ్రతతో వినాలి.

84 లక్షల జీవరాసుల్లో బ్రహ్మావలోకన బుద్ధికల మానవుణ్ణి సృష్టించిన తర్వాతనే బ్రహ్మకు సంతోషం కలిగింది. అసురత్వం వదలి దైవత్వం పొందాలి. ఆశ్రమాలలో వుండి తపస్సు చేసేవారు తమకు కరుణ కలిగిందా? పరోపకారం చేశామా? అని ఆలోచించుకోవాలి. ప్రాపంచిక గౌరవం కొరకు పాటుపడడం వ్యర్థం. అది పొరబాటు. దానిని సరిచేయడానికే ఈ సభలు ఏర్పాటయ్యాయి. అశాశ్వతాన్ని పట్టుకొని సనాతనాత్మను విస్మరిస్తున్నారు. అది తగదు.

రాత్రి నిద్రపోయేటప్పుడు మనస్సు పనిచేయడంలేదు. మానవుడు జీవించే వున్నాడు. హాయిగా నిద్రపోతున్నాడు. అప్పుడతణ్ణి ఏ శక్తి కాపాడుతున్నది? నిద్ర నుండి లేచిన తర్వాత 'హాయిగా నిద్రించాను' అని చెప్పే సాక్షి ఎవరు? ఆ సాక్షి మనలోనే వున్నాడు. అతణ్ణి మనం తెలుసుకోవడంలేదు. గురువు గారు ఆ సాక్షిని చూపుతున్నాడు. శిష్యుడు మననం చేస్తాడు. "తత్త్వమసి, అహంబ్రహ్మాఽస్మి" అనే మహావాక్యాల సారాంశం ఇదే. ఇది తెలుసుకొంటే ఎన్నో జన్మల రోగం తొలగిపోతుంది.

ఆ రోగమే భవరోగమనబడుతున్నది. ఈ లోకంలో పుట్టడమే ఒక తప్పు. అదే భవరోగం. డాక్టర్ రోగం లేదన్న మాత్రాన అది లేకుండా పోదు. పుట్టిన ప్రాణికి చావు తప్పదు. జనన మరణాత్మకమైన రోగం 84 లక్షల జీవరాసులలోనూ వున్నది.

సుకృతం చేసుకొని స్వర్గానికి పోయినవారు అక్కడనుండి మోక్షానికి పోలేరు. మళ్లీ భూలోకానికి రావలసిందే. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అని భగవద్వచనం. ఈ కర్మభూమికి వచ్చినవారు మోక్షం కొరకు ప్రయత్నించాలి. ఈ సభలు ఈ తత్త్వాన్ని తెలియజెప్పటానికే ఏర్పాటయ్యాయి.

మన ఎదుట ఎన్నో ప్రాణులు ఉన్నాయి. వాటిలో ఎలాంటి అభివృద్ధీ కనిపించడంలేదు. మనమూ అలాగే వుంటే పశుతుల్యులమేకదా! మళ్లీ ఈ మనుష్యత్వం వస్తుందన్న నమ్మకం లేదు. ద్వేషించే క్రూరులను అసురయోనులలో విసరిపారవేస్తా 'నని భగవంతుడన్నాడు. కాబట్టి అమూల్యమైన ఈ సదవకాశాన్ని జారవిడుచుకో కూడదు. వయస్సు దాటిపోతున్నది. ప్రమాదం ఎప్పుడు వస్తుందో ఎవరికీ తెలియదు.

*యావత్స్వస్థ మిదం శరీర మరుజం యావ జ్జరా దూరతః*
*యావచ్చేంద్రియశక్తి రప్రతిహతా యావ త్క్షయో నాయుషః*
*ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్*
*సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః*

ఒక ఊరిలో గుడిసెలు నిప్పంటుకొన్నాయి. అది రాత్రివేళ. అందరూ నిద్ర లేచారు. ఒకచోట సమావేశమయ్యారు. నిప్పు ఆర్పడానికవసరమైన నీటి కోసం బావి త్రవ్వాలనుకొన్నారట! ఇది సాధ్యమా? అందువల్ల ముందుగానే జాగరూకత కల్గి వుండాలి. శరీరం రోగగ్రస్తం కాకముందే, వార్ధక్యం పైకోనకముందే, ఇంద్రియ శక్తి దెబ్బతినకముందే, ఆయువు క్షయం కాకముందే బుద్ధిమంతుడైనవాడు ఆత్మశ్రేయస్సుకై పాటుపడాలి. జీవితాన్ని వృధా చేసుకోరాదు.

*"కో దీర్ఘ రోగో భవఏవ సాధో*
*కి మౌషధం తస్య విచార ఏవ"*

అన్నట్లు భవమే దీర్ఘవ్యాధి. ఆత్మ విచారమే దానికి తగిన మందు. జీవితాన్ని సంస్కరించుకోవడానికి శక్తియుక్తులున్నప్పుడే పాటుపడాలి. విన్నదాన్ని ఆచరించ డంలో ఆనందమున్నది. అంతేకాని ఊరక వినడంలో లేదు. విని మననం చేయండి.

అధర్మం, అన్యాయం అనేవి తగవు. 'యతో ధర్మ స్తతో జయః' ధర్మ మున్నచోటే జయముంటుంది. మనమున్నచోటినే ధర్మక్షేత్రం చేయండి. చీకటిని తొలగించడం మన కర్తవ్యం. ఇందుకు ఆధ్యాత్మిక ప్రసంగాలు చాలా అవసరం.

యయాతి మహారాజు తన జీవితానుభవాన్ని ఇలా ప్రకటించాడు-

నిప్పులో నేయి పోస్తే ఇంకా మండుతుందే కాని ఆరదు. భోగానుభవంవల్ల కామం వృద్ధిపొందుతుందే కాని శమించదు.

మనస్సుకు చలనం సహజం. ఇంద్రియాలను విషయాలు ఆకర్షిస్తాయి. అప్పుడు మనస్సుకు ఇలా బోధించాలి-

"[illegible] దిక్కు[illegible]
విలపింప నేలనో మనసా!
గురుపాదములబట్టి తత్త్వంబు తెలిసికొని
తప్పించుకోవోయి మనసా!"

దిన దినానికి ఆత్మోన్నతి పొందటానికై యత్నించాలి. మాయ లేకుండా వుండడమే మానవత్వం. కాని మాయ ఇంకా గట్టిపడుతున్నది. అందువల్ల సచ్ఛాస్త్రం పరిశీలించి అందులో చెప్పిన తరుణోపాయం పాటించి తరించాలి.

యుద్ధంలో జయించాలంటే బలం కావాలి. అలాగే అసురగుణాలను జయించాలంటే దైవ గుణాలు బలపడాలి. "నాయమాత్మా బలహీనేన లభ్యః-బలహీనునికి ఆత్మ లభించదు" అని ఉపనిషత్తు ఘోషిస్తున్నది.

ప్రతి క్షణం ప్రమాదభూయిష్టమే. అందువల్ల నేడే ప్రమాదమని తెలుసుకొని కర్తవ్య కర్మలు పూర్తిచేయాలి. పరీక్షిన్మహారాజు 7 రోజుల్లో మరణం అని గ్రహించి భాగవత గంగలో స్నానంచేసి తరించాడు.

తిరుమల ఘాట్ రోడ్డులో -'Start early, drive slowly, Reach safely' అని ఒక బోర్డుపై చూచి వుంటారు. ఇది చక్కని బోధ. బాల్యంలోనే సాధన మొదలుపెట్టి క్రమంగా అభివృద్ధి పొందుతూ క్షేమంగా గమ్యం చేరాలి.

వసిష్ఠుడు శ్రీరామునికి 16 సంవత్సరాల వయస్సులో యోగవాసిష్ఠం బోధించాడు. బోధ పూర్తి అయిన తర్వాత రాముడు దుఃఖించాడు. దుఃఖానికి కారణమేమి?

# ఆత్మానుసంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

మనశ్చక్షురాదేర్వియుక్తః స్వయం యో
మనశ్చక్షురాదే ర్మనశ్చక్షు రాదిః.
మనశ్చక్షురాదే రగమ్య స్వరూపః
స నిత్యోపలబ్ధిస్వరూపోఽహమాత్మా.

ఏది స్వయము మనస్సు నేత్రాది ఇంద్రియములు లేనిదియు, ఏది మనస్సునకు మనస్సో, ఏది మనస్సుచే నీకు నేత్రాది ఇంద్రియములచే అగమ్యమై యున్నదో, ఏది నిత్యము పొందబడియే ఉన్నదో అట్టి నిత్యబోధ స్వరూపమగు ఆత్మయే నేను.

OO

అని అడిగితే–"ఈ బోధ నా జీవితంలో 16 సంవత్సరాలు గడచిన తర్వాత వింటున్నానే! ఇంతకు ముందే విని వుంటే ఎంత బాగుండేది?" అని చెప్పాడు.

ఇప్పటి యువకులను తత్త్వబోధ వినమంటే not now అంటారు.

హృదయంలో పరమాత్మను ధ్యానించాలి. ధ్యానానంతరం విశ్రాంతి తీసుకోవాలి. అప్పుడు అపూర్వమైన సుఖం కల్గుతుంది. "ఆనందమంతర్నిజ మాశ్రయంతః" అన్నట్లు తనలోనే ఉన్న ఆనందాన్ని ఆశ్రయించి సుఖించాలి.

సాధనవల్ల సిద్ధి తప్పక కల్గుతుంది. తప్పక మార్పు కల్గుతుంది. చేసేది శ్రద్ధతో చేయాలి. బరువుగా, ఏదో లాంఛనంగా, చేయమన్నారని చేయడం తగదు. సోమరితనం తగదు.

ఒకడు పంచాక్షరీ మంత్ర పఠనకు పూనుకొన్నాడు. 'ఓం నమశ్శివాయ' అని ఒక్కసారి చెప్పి తరువాత 'డిటో డిటో' అన్నాడట! ఇలాంటి సోమరులకు ఎలా ముక్తి కలుగుతుంది? కాన సోమరితనం వదలి శ్రద్ధతో సాధన చేయాలి.

# ఆధ్యాత్మిక  కథలు

## అపూర్వ రామ భక్తి

పూర్వము కులశేఖరుడు అను గొప్ప రాజు కలడు. అతడు పరమ భక్తుడు. విష్ణువు (నారాయణమూర్తి) ఆతని ఇష్ట దైవము. నిరంతరము "ఓమ్ నమో నారాయణాయ" అను అష్టాక్షరీ మంత్రమును భక్తి పూర్వకముగ జపించుట, నారాయణుని స్తోత్రములను పఠించుట, శ్రీరంగమునకు యాత్ర సలుపుట అతని నిత్యకార్యక్రమములు. ఆ మహారాజునకు సంస్కృత భాషయందు గొప్ప పాండిత్యము కూడ కలదు. 'ముకుంద మాల' అను విఖ్యాత స్తోత్రమును అతడు సంస్కృతమున రచించెను.

ఒకప్పుడు కులశేఖరుడు తన ఆస్థాన పండితునిచే రామాయణము చదివించుచు ఏకాగ్ర చిత్తముతో శ్రవణము చేయుచుండెను. ఒక సందర్భములో పండితుడు 'పదునాలుగు వేల భయంకర రాక్షసులతో ఒక్కడేయగు రాముడు యుద్ధమున ఎదుర్కొనవున్నాడు'-అని చదివెను.

ఆ వాక్యమును వినగానే కులశేఖరుడు తక్షణమే తన సేనాధిపతిని పిలిచి 'రామునకు సహాయముగ మన సేనను కూడ పంపుడు' అని ఆజ్ఞాపించెను-రాజు యొక్క ఆజ్ఞను వినిన సేనాధిపతి ఏమి చేయుటకు తోచక తత్తర పాటు చెందుచుండెను. రాజభవనములో గొప్ప కలవరము బయలు దేరెను. అదియంతయు చూచి పండితుడు 'రాముడు శత్రువులగు రాక్షసులందరిని సంహరించి మహర్షులకు ఆనందమును గొలిపెను'- ▭

# ఆధ్యాత్మ బిందువులు

నాస్తి విద్యాసమం చక్షుః నాస్తి సత్యసమం సుఖమ్ ।
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం తపః ॥

విద్యతో సమానమైన నేత్రము లేదు. సత్యముతో సమానమైన సుఖము లేదు. సంసక్తితో సమానమైన దుఃఖము లేదు. త్యాగముతో సమానమైన తపస్సు లేదు.

న వైరాగ్యాత్పరం భాగ్యం న బోధాదపరః సఖా ।
న హరేరపరస్త్రాతా న సంసారాత్పరో రిపుః ॥

వైరాగ్యమును మించిన భాగ్యము లేదు. జ్ఞానమును మించిన మిత్రుడు లేడు. భగవంతుని మించిన రక్షకుడు లేడు. సంసారమును మించిన శత్రువు లేడు.

OO

---

అని చదివెను. అపుడు రాజు పరమానందపడి సైన్య విషయమును విరమించుకొనెను. ఈ సంఘటనద్వారా కులశేఖరుని అపార రామభక్తి ప్రకటితమగుచున్నది. ఎన్ని సంపదలున్నను కులశేఖరుడు దైవభక్తిని మహోన్నత సంపదగా భావించుచు అట్టి దైవభక్తిని లెస్సగ సంపాదించెను. రామునకు ఆపద కలుగునేమోయని భీతిల్లి ఆ మహారాజు తన సైన్యమును కూడ సహాయముగ పంపదలంచెను. కులశేఖరుని దైవభక్తి ఆదర్శవంత మైనది.

నీతి : కులశేఖరునకు భగవంతుని యెడల అపారమగు భక్తి కలదు. అతడు రాజ్యపరిపాలనము చేయుచున్నను నిరంతరము దైవస్మరణయే కలిగియుండును. కులశేఖరునివలె జనులు తమ భక్తి భావమును పెంపొందింపజేసుకొని భగవత్కృపకు పాత్రులై తరించుదురుగాక! OO



ఈశ్వర్

జన్మానికి శివరాత్రి అన్నట్లు 12 ఏళ్ళకొక్కసారి ఒక నదికి పుష్కరం అనే పండుగ వస్తూంటుంది. అది దీర్ఘ కాలానికి వచ్చే పండుగ కాబట్టి దానికొరకు చాలామంది ఎదురుచూస్తూంటారు. ముఖ్యంగ పెద్ద నదుల సమీపంలో యుండే వారు గొప్ప ఉత్కంఠతో దానికొరకు కాచుకొనియుంటారు. 12 రోజులు జనులు ఆయా నదులలో స్నానాలు చేసి దానధర్మాలు గావించి, పుణ్యాన్ని సంపాదిస్తూంటారు. అసలు పుష్కరమనేది ఎట్లా ఏర్పడుతుందో ఒకింత ఆలోచిస్తాం.

మూడున్నర కోట్ల తీర్థములతో కూడి పుష్కరు దేవత గంగాది నదులలో నివసించు కాలానికి పుష్కర కాలమని పేరు.

బృహస్పతి మేషరాశిలో ప్రవేశిస్తే గంగానదికి పుష్కరము.

ఆలాగుననే బృహస్పతి వృషభరాశియందు సంచరిస్తే నర్మదా నదికి,
మిధున రాశియందు సరస్వతీ నదికి,
కర్కాట రాశియందు యమునా నదికి,
సింహ రాశియందు గోదావరి నదికి,
కన్య రాశియందు కృష్ణా నదికి,
తులరాసియందు కావేరీ నదికి,
వృశ్చిక రాసియందు భీమరథీ నదికి,
ధనూ రాశియందు పుష్కర నదికి,
మకర రాశియందు తుంగభద్రా నదికి,
కుంభ రాశియందు సింధు నదికి,
మీన రాశియందు ప్రణీతా నదికి పుష్కరము.

ఈ సంవత్సరం (1992) సెప్టెంబరు 12వ తేదీ నుండి కృష్ణా నదికి పుష్కర సమయమై యున్నది. పుష్కర కాలంలో జనులు ఆయా నదులలో స్నానాలు

చేయటమే కాకుండా ఎందరికో దానాలు చేస్తారు. ధర్మ కార్యాలెన్నియో నిర్వహిస్తారు. ఈ విధంగ జనులు ఎంతయో పుణ్య సంపాదన గావిస్తూంటారు. మంచిదే.

కాని అన్ని నదులకంటె, అన్ని తీర్థములకంటె గొప్పదైన తీర్థమొకటి సమీపాన్నే యుంది. అదియే మానస తీర్థం. అదియే హృదయ తీర్థం. మనస్సును పవిత్రంగ యుంచుకొంటే, కామ క్రోధాదుల యునికి అచట లేకుండ చేస్తే అది అన్ని తీర్థములకంటె గొప్ప తీర్థముగ విరాజిల్లుతుంది. అట్టి పవిత్ర మానస తీర్థంలో స్నానం చేసినవారికి పుణ్యమే కాదు, సాక్షాత్ మోక్షమే లభిస్తుంది. ఈ రహస్యం తెలుసుకొని జనులు తమ మానస తీర్థాన్ని నిష్కల్మషముగ యుంచుకొని అందు ఎలాటి దోషాలు ప్రవేశింపనివ్వకుండ బహుజాగరూకతతో ప్రవర్తిస్తూ ఆత్మానందం అనుభవిస్తూ పవిత్ర మానవ జీవితాన్ని చరితార్థం చేసుకోవాలి. అద్దం నిర్మలంగ యుంటే, దుమ్ము లేకుండా యుంటే ముఖం స్వచ్ఛంగ గోచరించునట్లు మనస్సు శుద్ధంగ యుంటే అధిష్ఠానమగు ఆత్మయొక్క అనుభవము చక్కగ కలుగుతుంది. అట్టి ఆత్మానుభూతియే సర్వుల యొక్క చరమ లక్ష్యం. ఇతర పుణ్య కార్యాలతో పాటు ఈ మహత్తర కార్యాన్ని కూడ సాధించి జన్ములు ధన్యులయ్యెదరుగాక!

పుణ్య సంపాదన కొరకై పుష్కర తీర్థ సేవనము కొందరికి అందుబాటులో లేకపోవచ్చు. అందరికి సమీపంలో యున్న మానస తీర్థాన్ని పవిత్రవంతంగ చేసుకొంటే అట్టి తీర్థ సాన్నిధ్యంచే హృదయాన్ని పునీతం చేసుకొంటే జీవితం చరితార్థమౌతుంది. పరమశాంతి చేకూరుతుంది. జన్మరాహిత్యం సిద్ధిస్తుంది. కైవల్య పదవి సంప్రాప్తిస్తుంది.

OO

## ధన్వంతరి ఉవాచ

**అచ్యుతానంత గోవింద నామోచ్చారణ భేషజాత్**
**నశ్యన్తి సకలారోగాః సత్యం సత్యం వదామ్యహమ్**

**అచ్యుత, అనంత, గోవింద మున్నగు భగవన్నామములను ఉచ్చరించుట ఒక దివ్యౌషధ సేవనము. దానిచే సమస్త రోగములు నశించిపోవును. ఈ నా వాక్యము ముమ్మాటికిని సత్యము.**

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1) మెదడు బరువు 3½పౌన్లు. దానిలో 170 కోట్ల కణములు కలవు.

2) చంద్రుని వ్యాసము 2163 మైళ్లు. ఇది భూమి వ్యాసములో నాల్గవ వంతు.

3) ప్రపంచములో జపాన్ దేశస్థులు అందరికంటె ఎక్కువ కాలము జీవించుచున్నారు. వారి సగటు ఆయుఃప్రమాణము 74 ఏండ్లు.

4) యురేనస్ అను గ్రహము సూర్యునకు చాల దూరమున ఉండుటచే అచట చాల చలిగా నుండును. అచటి వాతావరణము సున్నకు 300 డిగ్రీలు తక్కువగా నుండును.

5) ఫ్రాన్స్ దేశములో నీటి కెరటముల నుండి విద్యుత్ శక్తిని ఉత్పత్తి చేయుచున్నారు.

6) ఈజిప్టులోని ది గ్రేట్ పిరమిడ్ 13 ఎకరముల విశాలమైన ఎడారి ప్రదేశములో 40 అంతస్తుల భవనమంత ఎత్తుగా నిర్మింపబడినది. ఇది 481 అడుగుల ఎత్తు–756 అడుగుల వెడల్పు కలిగియున్నది.

7) యురేనస్ గ్రహము యొక్క వ్యాసము 32 వేల మైళ్లు. ○○

---

Wage war against your animalistic instincts and come out Victorious.

నీ పాశవిక వికారములపై యుద్ధమును ప్రకటించి వానితో తెగించి పోరాడి జయమును వరింపుము.

---



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము - దుఃఖ పరంపర

**శిష్యుడు (శివప్రసాద్)**- గురుదేవా! మహాత్మా! నేటి జన సామాన్యము యొక్క నాడిని పరీక్షించి చూడగా ఎక్కువ మంది ప్రపంచంవైపు మొగ్గు చూపు తున్నారు కాని, దేవునివైపు కాదు. ఏ కొద్దిమంది పుణ్యాత్ములో భగవత్ప్రాప్తికై యత్నిస్తున్నారు. స్వామీ! జనులలో అధిక శాతం విషయ వ్యామోహంలోనే పడి, దృశ్యవైభవాలనే పట్టుకు వ్రేలాడుతూ కాలం గడుపుతున్నారే! అట్టి వారి మనస్తత్వం మారాలంటే ఏం చేయాలో సెలవివ్వండి, మహాప్రభో!

**గురువు ( ప్రబోధానందస్వాములవారు)** - నాయనా! శివప్రసాద్! నీవు చెప్పినట్లు జనులలో అధిక శాతం అజ్ఞానంవైపే మొగ్గు చూపుతున్నారు. నశ్వర పదార్థాలవైపే దృష్టి నుంచుతున్నారు. దీనికి కారణం సత్య విషయం వారికి తెలియక పోవటమే. క్రిందటిసారి నీకు చెప్పినట్లు జీవుడు స్వతంత్రుడుగ పైకి కన్పించినా దేశకాల క్రియలచే బద్ధుడై యున్నాడు. ఈ రహస్యం తెలిసినవాడే ఆ మూడిటి నుండి తప్పించుకోటానికి సద్గురువు చెంత చేరుతాడు. జైలులో ఉండే దొంగ 4 గోడల మధ్య బంధింపబడి యున్నాడని తెలుసుకొని విడుదల కొరకై నిరంతరం ఆలోచిస్తూంటాడు. బయట స్వేచ్ఛగ తిరుగువారికివిడుదలను గూర్చిన ప్రశ్నయే ఉదయింపదు.

ఈ దృశ్య ప్రపంచమొక జైలువంటిది. ఈ శరీరము ఒక జైలు వంటిది. దేశకాల క్రియలను గోడల మధ్య జీవుడు బంధింపబడియున్నాడు. తెలివిగలవాడు స్వేచ్ఛ కొరకై పరితపిస్తాడు. తాను బంధనమున ఉన్నానని ముందుగ ఎఱిగి బంధవిముక్తికై ఆలోచిస్తాడు.

దేశకాల క్రియలకు లోబడియున్నా, చావు పుట్టుకలు కొని తెచ్చుకొంటున్నా దానితో సంతృప్తిపడి, ఈ స్థితియే గొప్ప స్థితి అని తలంచువాడు, దానికంటే పై

స్థితికై ప్రయత్నింపనివాడు అజ్ఞానికాక మరియెవడు? ఈ ప్రపంచములో సుఖం తక్కువ, దుఃఖం ఎక్కువ; మోకాలు లోతు సుఖం ఉంది, మొల లోతు దుఃఖం ఉంది. ఒకవేళ ఒకింత సుఖాన్ని మానవుడు ఇంద్రియాలతో అనుభవించినా, కొండంత దుఃఖం ప్రక్కనే వేచియుంటుంది. కాబట్టి తెలివిగలవారు ఈ విషయాన్ని చక్కగా పర్యాలోచించి, ఇది ఒక ఆనందకరమైన లోకమని భావించక, దుఃఖభూయిష్ట మైన తమ బంధన స్థితిని గూర్చి బాగుగ ఆలోచించి దీనినుండి తప్పించుకొని నిరతిశయానంద స్థితిని పొందటానికై అహర్నిశాలు కృషి చేయాలి.

ఈ దృశ్య ప్రపంచాన్ని కీర్తించువారిని గూర్చి, ఈ ప్రపంచమే ఎంతో గొప్పదని భావించువారిని గూర్చి శ్రీకృష్ణపరమాత్మ గీతలో 'ఓ జనులారా! ఈ ప్రపంచమున గల దుఃఖములను గూర్చి పర్యాలోచించండి. సుఖాలు కొద్దిగా ఉన్నా, ఎన్నో దుఃఖాలు ప్రక్కనే కాచుకొని యున్నాయి. ఈ దృశ్య ప్రపంచంలో ఎంతో ఆనందమున్నదని తలంచువారు, ఇచటగల జన్మదుఃఖాన్ని గూర్చి విచారించారా? మృత్యు దుఃఖాన్ని గూర్చి విచారించారా? వార్ధక్య దుఃఖాన్ని గూర్చి ఆలోచించారా? వ్యాధి దుఃఖాలను గూర్చి ఏమైనా తలంచారా?" అని నిలదీసి ప్రశ్నించారు. "జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్" అని గీతాచార్యులు సెలవిచ్చి యున్నారు.

"ఓ జనులారా! ప్రపంచంలో కొద్ది సుఖాలున్నప్పటికి వెంటనే అనేక దుఃఖాలు ఉన్నాయి కాబట్టి, ఆ దుఃఖాలను గూర్చి చక్కగా విచారించి వాటిని పోగొట్టుకోటానికై మార్గం తెలుసుకోండి! ఆత్మజ్ఞానం ఒకటే ఆ మార్గం. బ్రహ్మాను భూతి ఒకటే మార్గం" అని శ్రీకృష్ణపరమాత్మ బోధించియున్నారు.

కనుక వివేకవంతులగువారు ఈ ప్రపంచంలోని దుఃఖపరంపరను గూర్చి తెన్నుగా చింతనచేసి, బాగుగ పర్యాలోచించి, ఆ దుఃఖాలను పోగొట్టుకోటానికి ఆత్మ జ్ఞానమను దివ్యౌషధమును ఐడసి, జన్మపరంపరకు ఇంతటితో స్వస్తి చెప్పి తమ తమ జీవితాలను చరితార్థం గావించుకోవాలి. శివప్రసాద్! గీతాచార్యులు బోధించిన ఈ పరమ సత్యాన్ని నీవు కూడ తెప్పగ మననంచేసి సాధనాతిశయంచేత స్వస్వరూప సాక్షాత్కారం పొంది దుఃఖపరంపరనుండి తప్పించుకొని ధన్యుడవు కా!

**శిష్యుడు** — గురుదేవా! తమ వాక్యాలను వింటూంటే నా హృదయం ఆనందంతో ఉప్పొంగిపోతుంది. దుఃఖపరంపరను దాటటానికై తమరు సెలవిచ్చిన రామబాణ ఔషధాన్ని పరిగ్రహించి సేవించి ధన్యుడను కాదలంచాను. అనుగ్రహించండి. సెలవు.

○○

# వినోదము-వికాసము

## క్విట్ మై హార్ట్
## (నా హృదయమును విడిచిపొండి)

భారతదేశంలో ఇపుడు 'క్విట్ ఇండియా' ఉద్యమము యొక్క స్వర్ణోత్సవ కార్యక్రమాలు ముమ్మరంగ జరుగుతున్నాయి. 50 సంవత్సరముల క్రిందట భారతీయులందరు కలసి "మీరు మా దేశాన్ని విడిచి వెళ్ళండి" అని ఆంగ్లేయుల కిచ్చిన అల్టిమేటమే (హెచ్చరికయే) ఈ 'క్విట్ ఇండియా' ఉద్యమము. కానీ వారొక రాగాన కదల్లేదు.

దాదాపు 200 సంవత్సరాల దీర్ఘకాలము బ్రిటిషువారు మనదేశంలో తిష్ఠ వేసుకొని పరిపాలన సాగించారు. క్విట్ ఇండియా ఉద్యమంవల్ల గాంధీజీ మొదలైన నాయకుల యొక్క ప్రబోధంవల్ల జనులలో ఒక విధమైన స్ఫూర్తి కలిగింది. వారు ఎన్నియో త్యాగాలు చేశారు. లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకు వెళ్ళారు. ఎందరో అశువులు బాశారు. భారతీయులలో ఉద్భవించిన ఈ నవచైతన్యం వల్ల ఆంగ్లేయులు నెమ్మదిగ దేశాన్ని విడిచివెళ్ళారు.

స్వరాజ్యం వచ్చింది. కాని స్వారాజ్యం రాలేదు కదా! గాంధీజీ కలలు కన్న రామరాజ్యం ఏర్పడలేదు గదా! బయటయున్న విదేశీపరిపాలకులు వెడలిపోయినారే కాని జనుల యొక్క హృదయాల్లో తిష్ట వేసుకొనియున్న అంతశ్శత్రువులు కదల్లేదు. వారే కామక్రోధాది శత్రువులు. ఒక జన్మ కాదు, రెండు జన్మలు కాదు, ఎన్ని జన్మలనుండియో వారు హృదయగేహమున తిష్ఠ వేసుకొని జీవుని ముప్పతిప్పలు పెడ్తున్నారు. వారి ఉనికి వల్లనే జనులకు శాంతి మృగ్యమై పోయింది.

కాబట్టి పరిపూర్ణశాంతిని అభిలషించేవారు స్వరాజ్య సంపాదనతోపాటు, స్వారాజ్య సంపాదన కూడ గలిగియుండాలి. ఆ కామక్రోధాది అంతశ్శత్రువులకు 'క్విట్ మై హార్ట్', 'నా హృదయాన్ని విడిచి వెళ్ళండి' అని అల్టిమేటం ఇవ్వాలి. పట్టుదలతో ఇక్కార్యాన్ని సాధించాలి. కార్యసాధనకై ఎన్నో ఉపాయాలు అవలంబించాలి.

# పరమార్థసూక్తులు



- తన్ను తాను విమర్శించుకొనుట వివేకము. ఇతరులను విమర్శించుట అవివేకము.
- ధనము, విద్య, కీర్తి, అవివేకులకు మదమును, వివేకులకు వినయమును కలిగించును.
- అద్భుతములను సాధించుటకు దృఢ నమ్మకము, ఆత్మవిశ్వాసము మూలములు.
- శాంతి నీ లోపలనే గలదు. మఱియొక చోట లభించదు.
- ఎదుటివారి మనస్సును నొప్పించరాదు.
- జీవించియున్నంతవరకు నేర్చుకొనుచునే యుండవలెను.
- కోరికలను తగ్గించుకొని ఐహిక సుఖములను జయించువాడు వివేకవంతుడు. ○

ప్రతిబంధకాలు గాని, కష్టాలు గాని కలిగితే వాటిని ఓర్చుకొని ముందుకు కొనసాగాలి. వివేకవైరాగ్యాదుల సహాయంతో ఇంద్రియాలపై విజయాన్ని సాధించాలి.

ఎన్ని జన్మల నుండియో జీవుని ముక్కుకు తాడుకట్టి ఈడ్చుచున్న ఇంద్రియాలకు ఈ జన్మలో కళ్ళెం వేయాలి. దైవము ఎడల, సద్గురువు ఎడల, శాస్త్రం ఎడల అచంచల విశ్వాసము కలిగి పరమార్థసాధనను చేస్తూ రావాలి. దైవీగుణాలను అలవాటు చేసుకొని అసురగుణాలను వెడలగొట్టాలి. కష్టాలు వచ్చినపుడు ఏమాత్రం క్రుంగిపోక అంతయు మన మేలుకొరకే అని భావిస్తూ భగవద్విశ్వాసమునేమాత్రము సడలింపక అధ్యాత్మమార్గమున పురోగమనము సలపాలి.

జీవితం చాలా స్వల్పం. చేయవలసిన సాధనలెన్నో యున్నాయి. కాబట్టి ధైర్యంతో పట్టుదలతో ముందుకు కొనసాగుతూ మనస్సుపై, ఇంద్రియాలపై, కామాది అంతశ్శత్రువులపై విజయాన్ని సాధించాలి. ఆత్మ సామ్రాజ్యాన్ని కైవసం చేసుకోవాలి. ప్రణవపతాకాన్ని ఎగురవేయాలి. ఆత్మస్వాతంత్ర్య దినాన్ని జరుపుకోవాలి. ఆత్యంతిక శాంతి సుఖాలకు ఇదియొకటే మార్గం. జన్మరాహిత్యానికి ఇదొక్కటే ఉపాయం.

కామః క్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ
తస్మాజ్జాగ్రత జాగ్రత

సెప్టెంబరు 1992



# శ్రీ వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

లీలాదేవి, సరస్వతీదేవి ఇరువురును పూర్వ సంకల్పానుసారము సూక్ష్మదేహ ధారులై ఒకరి చేయి నొకరు పట్టుకొని అతిదూరమాకసమున నెగసి, అనేక పర్వత, నగర, మృగ దేవతాదిమయమైన జగత్తును, అందు సప్త సముద్రావృతమగు భూతలమును అట గిరిగ్రామమును వీక్షించిరి.

ఆ గిరిగ్రామమందలి బ్రాహ్మణుని గృహము నందు జనులు దుఃఖపూరితులై యుండిరి. అచ్చోటుకేగి వారిరువురును నచటి వార్కికి అదృశ్యరూపమున నుండిరి. అపుడు లీల తన సత్య సంకల్పముచే తానున్ను, సరస్వతీదేవియు సామాన్య స్త్రీ రూపమున వారలకగుపించుగాకయని సంకల్పించెను.

వెను వెంటనే అచటి వారందఱును దేదీప్యమానముగ ప్రకాశించుచున్న యా ఇరువురు దేవీ సమాన నారీమణులను గాంచి విస్మితులైరి. అపుడు మృతబ్రాహ్మణుని పుత్రుడగు జ్యేష్ఠశర్మ వారిరువురను బూజింపనంత వారు అచటివారియొక్క దుఃఖ కారణ మరయ బ్రాహ్మణ పుత్రుడు తన తల్లిదండ్రుల మరణము సంభవించుటయు దానిచే నా గ్రామవాసులు మొదలగు వారందరు దుఃఖమయులగుటయు వివరించి తద్దుఃఖోపశమనమునకై వేడుకొనెను. అంతట లీల వంగి తన పుత్రుని మస్తకమును చేతితో స్పృశింప ఆతని యొక్కయు అచటి వారందఱి యొక్కయు దుఃఖము దూరీకృతమయ్యెను. అనంతరము వారిద్దరును అంతర్ధానమైరి. తదుపరి లీల దేవినిట్లు ప్రశ్నించెను.

**లీల :–** నా పతిజీవుడు రాజ్యమేలు చోటనున్న జీవులు నన్నేల చూడలేదు? నా పుత్రుడెట్లు చూడగల్గెను?

దేవి :- అపుడు ప్రపంచ మిథ్యాత్వ భావన నీకింకను రూఢి పడలేదు. నేను లీలను అను భావమున్ను పోలేదు. అవిద్యయు పూర్తిగ తొలగలేదు. కాబట్టి సత్య సంకల్పము కలుగలేదు. ఇపుడు జ్ఞానావిర్భావముచే సత్య సంకల్పము కలదానవు కాగా నీవు తలంచినందున పుత్రుడవ్విధమున జూడగల్గెను.

ఈ మండపాకాశమందు మువ్వురు పతులే కాదు. అతీత, అనాగత, అనేక భూత లాదులు అనేక జన్మలందలి అనేక పతులు గలరు. ఈ మువ్వురిలో మూడవ పతి ఇప్పుడు ఒకానొక బ్రహ్మాండమున రాజ్యమేలుచున్నాడు. ఆ బ్రహ్మాండము సమీపముననే యున్నను వ్యవహారదృష్టిచే కోట్లకొలది మైళ్ళ దూరమున గలదు. ఈ మువ్వురిలో నీవు ఏ పతి సమీపమునకిపుడు పోనుంకించుచున్నావో వచింపుము. అచటికి నిన్ను చేర్చెదను.

లీల :- నీవు చెప్పినది వాస్తవమే. సృష్టి ప్రారంభము నుండి ఇప్పటికి నాకు 800 జన్మలు గడచినవి. వానినన్నిటిని నేనిపుడు స్మరించుచున్నాను. విద్యాధరినై పుట్టితిని; శబరియై జన్మించితిని. మత్స్యమై పుట్టితిని. గోవుగ జన్మించితిని- వెయ్యేల ఎన్నియో జన్మలందు సుఖదుఃఖములననుభవించుచు ఈ సంసార సముద్రమునఁ దిరుగాడితిని.

ఈ ప్రకారముగ వారు పరస్పరము మాట్లాడుకొనుచు ఆ గిరిగ్రామ సౌందర్యము నంతయు స్మరించినదై, ఆ విషయమంతయు దేవికి విన్నవించి, ఆ పిమ్మట తన భర్తృ నగరమునకు బోయెదమన్న కోర్కెను వెలిబుచ్చెను. అట్లే వారిరువురును స్వర్గాద్యనేక లోకములను దాటి బ్రహ్మాండ కటాహమును ఛేదించుకొనిపోయి అట మన్న జలాద్యావరణములను దాటిరి. అత్తటి చిదాకాశమున వట కోట్లకొలది భిన్న భిన్న సృష్టులను, జగత్తులను లీల చూచెను.

OO

---

**'Faith in ourselves and faith in God'- This is the secret of greatness.**

**తనయందు పూర్ణ విశ్వాసము గలిగియుండుట మఱియు దేవునియందును పూర్ణ విశ్వాసము గలిగియుండుట- ఇదియే మానవుని ఔన్నత్యమునకు కీలకమైయున్నది.**

# పరమహంస సదుపదేశములు

## శ్రీ రామకృష్ణ పరమహంస ఇట్లు చెప్పిరి–

1. ఒక వేటగాడు అరణ్యములో ఒక పక్షికి గురిపెట్టుచుండెను. అవధూత అతనిని ప్రక్క ఊరికి మార్గమడిగెను. కాని వేటగాడు బదులు పలుకలేదు. వేటగాని దృష్టి పక్షిమీద పూర్తిగా లగ్నమై యుండుట వలన అతడు ప్రత్యుత్తరము ఏమియు ఇవ్వలేకపోయెను. అవధూత అతనిని తన గురువుగా భావించెను. దైవధ్యానము చేయునపుడు మనస్సును అన్యత్ర పోనీయరాదు, భగవంతునియందే లగ్నము చేయవలెను.

2. గ్రుడ్డివారు నలుగురు ఒక ఏనుగు యొక్క ఆకారమును పరిశీలింపదొడగిరి. ఒకడు ఏనుగు యొక్క కాలును పట్టుకొని 'ఏనుగు స్తంభమువలె యున్నద'ని పలికెను. రెండవవాడు ఏనుగు తొండమును పట్టుకొని 'ఏనుగు ఒక గుండ్రని దూలమువలె ఉన్నద'నెను. మూడవవాడు ఏనుగు యొక్క ఉదరమును తడిమిచూచి 'అది ఒక గోడవలె ఉన్న'దని చెప్పెను. నాలుగవవాడు దాని తోకను పట్టుకొని 'ఏనుగు ఒక త్రాడువలె ఉన్నద'ని వచించెను. ఈ విధముగ వారు భిన్న భిన్న అభిప్రాయములు కలిగి కలహించుకొనుచుండిరి.

   ఆ మార్గముననే వచ్చుచున్న ఒక సాధువు వారి విషయమంతటిని ఆలకించి వారితో ఇట్లు పలికెను– "మీలో ఎవ్వరును ఏనుగు చూచియుండలేదు. మీరు తెలుసుకొన్న దానిని మీరు తెలిపారు. మీరు చెప్పిన వర్ణనయంతయు కలసి ఏనుగుయొక్క పూర్తి వర్ణన అగును"

   భగవంతుడు అన్ని రూపములలో వెలుగొందుచున్నాడు. అందు కొందరు కొన్ని కొన్ని రూపములను గూర్చియే వర్ణించుకొనుచు పోట్లాడుకొనుచున్నారు. సర్వరూపములు సచ్చిదానందస్వరూపులగు భగవంతునివేయని గ్రహించి జనులు సమభావమును కలిగియుండవలెను.

3. సదరు వాక్యములను శిష్యుడు భక్తిశ్రద్ధలతో ఆలకించి ఆచరించవలయును. అనుభవజ్ఞులైన గురువులు సర్వకాలములందును నిత్యానంద స్వరూపులై యుం

దురు. అనేక రకములైన లౌకిక జనుల మధ్య వున్నను గురువు తమ పవిత్ర స్వభావమును వీడకయే యుండును.

స్వస్వరూపజ్ఞానమును సంపాదించునంతవరకును సాధకుడు ఆధ్యాత్మిక శాస్త్రములందు తెలుపబడిన నియమములను శ్రద్ధాపూర్వకముగ ఆచరించుచుండవలెను. జనులకు ఆదర్శముగ వుండుటకుగాను బ్రహ్మజ్ఞానులు విధి నియమములను పాటించుచుందురు.

ఆధ్యాత్మిక సాధకుడు శీతోష్ణములందు, మానావమానములందు, నిందాస్తుతులందు సమత్వమునే కలిగియుండవలెను. ద్వంద్వములు సంభవించినపుడు సమబుద్ధిని కోల్పోయినచో అతని మనస్సు చంచలముగ వుండి ధ్యానమందు నిలకడను పొందలేదు. కావున ముముక్షువులు ఎల్లవేళలందును రాగద్వేషములకు లోనుగాక నిశ్చలమనస్సు కలిగి పరమశాంతిని అనుభవించవలెను. ○○

# గో సర్ప విభేదము

దోషో గుణాయ గుణినాం
మహదపి దోషాయ దోషిణాం సుకృతం
తృణమివ దుగ్ధాయ గవాం
దుగ్ధమివ విషాయ సర్పాణాం.

గుణవంతులు ఇతరులందరి దోషములను కూడ గుణములుగనే గ్రహింతురు. గుణహీనులు ఇతరుల గుణములను కూడ దోషములుగనే స్వీకరింతురు. ఎట్లనిన- గోవులు గడ్డి తిని, ఆ గడ్డిని క్షీరముగా మార్చుకొని ఆ క్షీరమును ఇతరుల కొసంగి ఉపకారము చేయును. సర్పములు పాలుత్రాగి ఆ పాలను విషముగా మార్చుకొని ఆ విషమును ఇతరుల కొసంగి అపకారము చేయును.

*(కావున వివేకవంతులు గోవువలె గుణగ్రాహులై పరోపకారపరాయణులై యుండవలెనేకాని సర్పమువలె దోషగ్రహణశీలురై, అపకారయుతులై మెలగరాదు.)*

# ధ్యానయోగ సాధనకు అర్హతలు

## శ్రీ రామకృష్ణానందస్వాములవారు (గండిక్షేత్రము)

మనుష్యజీవి ఒక్కడే ఆత్మను పరమాత్మను తెలుసుకోగలిగేది. భాగవతము మాటలలో "బ్రహ్మావలోక ధిషణుడు" మనుష్యుడొక్కడే. ఆత్మాభిన్నమైన పరబ్రహ్మాన్ని యెరిగే సాధనమైన బుద్ధి ఒక్క మనుష్యునికే వుంది. పాలలో వెన్న వ్యాపకంగా వుండి కూడా మథించనిదే బైటికి రాదు. ఆత్మ వ్యాపకమై వున్నా కూడా బుద్ధిని మథించనిదే ఆత్మప్రాప్తి లేదు? ఆ మథించే సాధననే ధ్యానయోగమంటారు.

పరమాత్మ సర్వవ్యాపకంగా వుండి కూడా స్తంభాన్ని బ్రద్దలుచేయనిదే హిరణ్యకశిపునికి దర్శనమీయలేదు. పౌరుషంతో ప్రయత్నంతో ప్రబల ధ్యాన సాధనతో ఆవరణభంగం కల్గనిదే ఆత్మప్రాప్తి అందని పండు. ధ్యానసాధనకు కావలసిన సలహాలను భగవద్గీత యేమని చెబుతుందో విందాము.

"వివిక్తసేవీ లఘ్వాశీ – యతవాక్కాయ మానసః
ధ్యానయోగపరోనిత్యం – వైరాగ్యం సముపాశ్రితః"

"ఏకాంతమును సేవించేవాడు, అల్పాహారి, మనోవాక్కాయములను స్వాధీనము చేసుకొన్నవాడు, వైరాగ్యశీలుడు–ఈ అర్హతలుకలవాడే నియతముగ ధ్యానయోగాన్ని అభ్యసించగల్గుతాడు"

మొదటి మాట వివిక్తసేవి. అనగా ఏకాంతసేవనము వానికి అవసరము. సిద్ధుని మాట వేరుకాని సాధకునికి మాత్రము జనసమ్మర్దము పనికిరాదు. సైకిలు నేర్చుకొనేటప్పుడు విజనప్రదేశమే కావలసి వుంటుంది. ఆరితేరినవాని మాట వేరు. యోగసాధన విషయం కూడా అంతే.

ఏకమనగా పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే సర్వానికి అంతము; అనగా అవధి. ఆ బ్రహ్మాన్ని ఉపాసించుటే ఏకాంతవాసము. బ్రహ్మమును సోఽహం భావముతో ఉపాసించడంతో ఉపాధులు మిథ్యయనే నిశ్చయం కల్గుతుంది. ఇది కొంత

పైమాట. సాధకుని పక్షంలో యెవ్వరూ లేని యేకాంతస్థలాన్నే అపేక్షించాలె. "ఏక్ నిరంజన్" అనే సూక్తి వుందికదా! కానీ ఈ యేకాంతం కూడా అందరికీ మేలుచేయదు. సోమరికి, విషయాసక్తునికి కీడే చేస్తుంది. నిజమైన సాధకునికి యేకాంతం అత్యగత్యం. వానికది మహోపకారం చేస్తుంది.

ఏకాంతసేవనంతో పాటు సాధకుడు లఘ్వ్యాశి కావాలె. అనగా-అల్పాహారి కావాలని అర్థము. ఆహారమెట్టిదో ఆచారమట్టిది. 'వాడేమి తింటాడో చెప్పు-వాడేమి ఆలోచిస్తాడో నేను చెప్పుతా'నంటూ "పైథాగరస్" అన్నాడు. కంటికి, కాలికి సంబంధం వున్నట్లు జిహ్వకు, గుహ్యానికి సంబంధం వుంది. "ఔపస్థ్యజైహ్వకార్పణ్యాత్ గృహం పాలయతే జనః"-జిహ్వేంద్రియ గుహ్యేంద్రియాలకు దాసుడై జనుడు గృహాన్ని కాపలా కాస్తూన్నాడని భాగవతం చెప్పింది. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః-సత్త్వ శుద్ధౌ ధ్రువాస్మృతిః స్మృతిలాభే సర్వగ్రంధీనాం విప్రమోక్షః" ఆహార శుద్ధితో అంతఃకరణశుద్ధి, అంతఃకరణశుద్ధితో ఆత్మ యొక్క అవిచల స్మృతి తద్వారా అజ్ఞాన గ్రంధుల నుండి విడుదల లభిస్తుందని ఛాందోగ్యోపనిషత్తు చెప్పింది.

ఈ చోట అల్పాహారి అంటే ఆహారమనే మాటకు కేవలం తినే అన్నమే కాకుండా పంచేంద్రియాలతో గ్రహించే శబ్దాది పంచ విషయాలను కూడా అర్థం చెప్పుకోవచ్చు. సాధకుడు ఇంద్రియార్థ జీవి కాకుండా ప్రాణార్థ జీవి కావలెనని అర్థము.

మరియు సాధకుడు యతవాక్కాయమానసుడు కావాలి. ఏకాంత సేవనము, మితాహారముతో పాటు మనోవాక్కాయాలను నియమంలో పెట్టుకోవలసి వుంటుంది. మనస్సులోనిది మాయమర్మములు లేక బాలకునివలె వాక్కుతో పలుకుట-వాక్కుతో అనినది శూరవీరునివలె ఆచరణలో పెట్టుట సాధకునికి అసమానసంపత్తు. ఈ విధంగా త్రికరణశుద్ధి లేనివానికి ధర్మశుద్ధి లేదు; ధర్మశుద్ధి లేనివానికి భగవదనుగ్రహం కల్గదు. మరో మాట యేమంటే-ఈ త్రికరణాలను అనాత్మవ్యాపారాల నుండి మళ్ళించి సాధకుడు ఆత్మచింతనానికి అనుకూలం చేయాలె.

ఏకాంతసేవనము, లఘ్వ్యాహారము, త్రికరణశుద్ధి కల్గినవానికి సహజంగా వైరాగ్యం కల్గి వుంటుంది. భోగి ప్రపంచంలో ఒక రోగి. వైరాగ్యం కలవాడే

నిజమైన ఆరోగ్యం కలవాడు. భోగి రోగి విరాగి నిరోగి. యమధర్మరాజును విభ్రాంతుని చేసిన బాల యోగి నచికేతుని వైరాగ్యము కఠోపనిషత్తులో ఉజ్జ్వల దృశ్యము. బాలసంన్యాసి శంకరాచార్యులవారి అద్భుత వైరాగ్యము అసాధారణ ఉదాహరణము. త్రికరణాలను స్వాధీనం చేసుకొన్నవాడే వైరాగ్యాన్ని ధరించగల్గుతాడు.

అట్టి సాధకుడు నిత్యము ధ్యానయోగపరుడు కావాలె. ఆహారమేవిధంగా నిత్యకృత్యమో ధ్యానమూ ఆ విధంగా నిత్యకృత్యం కావాలె. ఆహారము స్థూలశరీరానికి, ధ్యానము సూక్ష్మశరీరానికి ఆవశ్యక వస్తువులు. ఏకాంత సేవనానికి అలవాటు పడినవాడు, ఆహార సంయమనం కలవాడు త్రికరణాలను పరిశుద్ధి చేసుకొన్నవాడు మాత్రమే ధ్యానయోగానికి నిజమైన అధికారి. ఇంద్రియ విషయాలను నిగ్రహించడంతో శరీరం వానికి వశమై వుంది. హితమూ, మితమూ, సత్యమూనైన భాషణంతో వాక్కు పవిత్రత వహించింది. మనస్సులో అనాత్మచింతనాన్ని త్యజించాడు. ఈ విధంగా వానికి త్రికరణాలు శుద్ధివహించాయి.

ఆత్మధ్యానము, పరమాత్మ ధ్యానము యెంతకాలము చేయాలనే సమస్య లేదు. శరీరముండువరకు అన్నము తినినట్లు మనస్సుండువరకు ధ్యానము చేయవలసిందే. ధ్యానము జ్ఞానముతో పర్యవసానం చెందుతుంది. మనస్సు అమనస్కమయ్యే వరకు ధ్యానం చేయవలసినదే. సంధ్యావందనం యెన్నాళ్ళు చేయాలనే మాట లేదు. ధ్యానమూ అంతే. ధ్యానయోగంలో సిద్ధిని బొందగోరేవాడు భగవద్గీత చెప్పిన ఈ సలహాలను పాటించి కృతకృత్యుడు కావాలె.

"గీతా సుగీతా కర్తవ్యా" ○○

---

Infinite energy is at the disposal of every one; one has to know how to get it.

**ప్రతివానియందును అనంత శక్తి ఇమిడియున్నది. దానిని పొందు విధానము తెలిసికొనవలయును. అట్లు తెలిసికొనినచో అది వానికి తప్పక సంప్రాప్తించగలదు.**

# ఖట్వాంగ దిలీపుడు

ఖట్వాంగ దిలీపుడు నారీకవచుని కుమారుడైన ఇలబిలుని పుత్రుడు.

దిలీపుని యొక్క ధర్మపత్ని సుదక్షిణ. దేవదానవ యుద్ధమునందు దిలీపుడు ఇంద్రునకు సహాయముగ వెడలెను. అతడు కార్యార్థమై ఇంద్రలోకమునుండి భూలోకమునకు త్వరత్వరగ పోవుచు, మార్గమధ్యమందున్న సురభి అను కామధేనువును గమనింపక వెడలిపోయెను. అందులకు సురభి కోపించి అపుత్త్రికుడు అగునట్లు అతనిని శపించెను.

ఆ విషయమెఱిగి దిలీపుడు వసిష్ఠుని ఆశ్రమమును చేరి వారిని ఆశ్రయించెను. అపుడా మహర్షి తమ ఆశ్రమముననేగల ధేనువును అర్చించుచున్నచో మీ అభీష్టము నెరవేరునని పలికెను. కొంతకాలమునకు అతనికి రఘువు అను పుత్రుడు జనించెను.

ఒకపుడు దిలీపుడు నూరవ అశ్వమేధయాగము చేయుచుండగ, యాగాశ్వమును ఎవరో అపహరించిరి. అపుడు దేవతలు యుద్ధమందు తమకెంతో సహాయము చేసినట్టి దిలీపుని ఏదైన వరము కోరుకొమ్మనిరి. తన ఆయుష్కాలము ఎంత వున్నదని అతడడుగగా, ఇంక రెండు ఘడియలు మాత్రమే అని దేవతలు తెలిపిరి. పిదప దిలీపుడు ఐహికవాంఛలనన్నిటిని విడనాడి యోగాభ్యాసముచే భగవత్సాయుజ్యమును బడసెను.

(పెద్దల యెడల పూజ్యభావము, వినయవిధేయతలు కలిగియుండవలెను. వినయాది సద్గుణముల వలన, భక్తిశ్రద్ధల వలన మానవుడు ఉన్నతస్థితిని అధిరోహింప గలుగును. అహంకారము కలిగియున్నచో జీవుడు పతనమొందిపోవును.) ○○

---

The greatest error is that one is weak.

ఒకనిని దుర్బలునిగ చిత్రించుటయే గొప్ప తప్పు.

(అందరి యందును ఆత్మ కలదు కావున)

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు

శాశ్వత చందా రు. 300/-లు

1. శ్రీ జి. తిప్పెస్వామి శ్రేష్ఠి & సన్స్ – కుడ్లిగి (K.S.)
2. శ్రీ ఎ. సాయిప్రసాదరావు గారు – బందరు
3. శ్రీ కె. సత్యనారాయణ గారు – గుమ్మవేరు
4. శ్రీ జె. నాగమునెయ్య గారు – ప్రొద్దుటూరు
5. శ్రీ పావని ఇంజనీరింగ్ కం. – విశాఖ
6. శ్రీ బి. శంకరయ్య గారు – రుద్రవరం
7. శ్రీ ఎమ్. అమృతరావు గారు – మాచవరం
8. శ్రీ కె. రామకృష్ణారావు గారు – హైదరాబాద్
9. శ్రీ జి. గంగారామ్ గారు – బాంబే
10. శ్రీ టి. నర్సయ్య వెంకయ్య గారు – బాంబే
11. శ్రీ ఎన్. రాజయ్య గారు – బాంబే
12. శ్రీ కె. శారద గారు – మద్రాస్
13. శ్రీ కె. ఆనందరావు గారు – రాజమండ్రి
14. శ్రీ ఎమ్. రామలింగేశ్వరరావు గారు – పాలకొల్లు

When one realises his own Self to be the all, he cannot desire, but simply enjoys everything as his.

ఎపుడు తన ఆత్మయే ఈ సమస్తము అని మనుజుడు అనుభూతమొనర్చుకొనునో, అపుడిక పదార్థములను అతడు వాంఛింపలేడు. అంతయు తానేననియు మాత్రము ఆనందపడు చుండును.






1. కృష్ణా పుష్కర సందర్భమున శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు విజయవాడ , P.W.D. ఎగ్జిబిషన్ గ్రౌండ్‌నందు మాచే ఏర్పాటుచేయబడిన స్టాల్‌నందు లభించును.
2. P.W.D. ఎగ్జిబిషన్ గ్రౌండ్‌నందలి మరొక భాగాన తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించుదురు. అచట కూడా శ్రీ శుకబ్రహ్మాశ్రమ పుస్తకశాల ఏర్పాటు చేయబడును.
   వివరములకు : ఈశ్వర్, స్వామీజీ సెక్రటరీ, విజయవాడ. ఫోన్స్ : 473509, 473725. జగదీష్ పేపర్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ నెం. 40–1–140, లబ్బీపేట, బందర్ రోడ్, అధికారి హోటల్ ప్రక్కన, విజయవాడ–520 010.
3. చిత్తూరు జిల్లాయందలి 'పుత్తూరు' పట్టణమున శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరి నూతన దేవాలయమున ప్రతిష్ఠా కార్యక్రమము 30.8.92 నాడు శ్రీ విద్యాప్రకాశా నందగిరి స్వాములవారి ఆధ్వర్యమున జరిగెను.

శ్రీకాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు నెలకొల్పబడిన "భక్త కన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి" నిమిత్తము విరాళము లొసంగిన భక్తుల పేర్లు–

| | | రూ. |
|---|---|---|
| 1. | శ్రీ దీపాల ఈశ్వరయ్య గారు, హైదరాబాద్ | 5,116 |
| 2. | శ్రీ వుజత్తు నారాయణరావు గారు, మచిలీపట్నం | 2,748 |
| 3. | శ్రీ సువర్ణమ్మ గారు, హైదరాబాద్ | 1,116 |
| 4. | శ్రీ కె.పి. మార్కండేయరావు గారు, హైదరాబాద్ | 1,116 |
| 5. | శ్రీ పి. పాండు గారు, హైదరాబాద్ | 1,116 |
| 6. | శ్రీ పి. గోవర్ధనరావు గారు, హైదరాబాద్ | 1,116 |
| 7. | శ్రీ వి. వేంకటరావు గారు, హైదరాబాద్ | 1,116 |
| 8. | శ్రీ బి. లక్ష్మణయ్య గారు, హైదరాబాద్ | 1,116 |
| 9. | శ్రీ పి. రాధాకృష్ణశర్మ గారు, హైదరాబాద్ | 1,116 |
| 10. | శ్రీ పి.వి.ఎల్. నరసింహారావు గారు, హైదరాబాద్ | 1,116 |

| | | |
|---|---|---|
| 11. | శ్రీ జి.వి. భాస్కరరావు గారు, హైదరాబాద్ | 1,116 |
| 12. | శ్రీ పి. కోటేశ్వరమ్మ గారు, హైదరాబాద్ | 1,116 |
| 13. | శ్రీ పి. భగవత్ప్రసాద్ గారు, హైదరాబాద్ | 1,116 |
| 14. | శ్రీ బి.ఎస్. రామచందర్ గారు, హైదరాబాద్ | 1,116 |
| 15. | శ్రీ వి. పుల్లంరాజు గారు, హైదరాబాద్ | 1,116 |
| 16. | శ్రీ ఎస్. ఆదినారాయణ గారు, హైదరాబాద్ | 1,116 |
| 17. | శ్రీమతి బి. అన్నపూర్ణమ్మ గారు, కర్నూలు | 1,116 |
| 18. | ఇ. నరసింహులు గుప్త గారు, హైదరాబాద్ | 1,116 |
| 19. | పి. శాంతమ్మ గారు, హైదరాబాద్ | 1,116 |
| 20. | వి. వేంకటేశ్వరరావు గారు, కాకినాడ | 1,116 |
| 21. | బండారు రెడ్డయ్య & సన్స్, తుని | 1,116 |
| 22. | ఎన్. వీరభద్రం గారు, ఖమ్మం | 1,116 |
| 23. | వి. వేంకటేశ్వర్లు గారు, భీమవరం | 1,116 |
| 24. | పి. సత్యనారాయణ గారు | 1,116 |
| 25. | శ్రీ జి. జగన్నాథరావు గారు, విశాఖ | 1,116 |
| 26. | లితా ట్రాక్టర్ వర్క్స్, నెల్లూరు | 1,116 |
| 27. | శ్రీ వి.వి. సుబ్రహ్మణ్యం గారు, హైదరాబాద్ | 1,116 |
| 28. | శ్రీ పి. ప్రభాకర్ గారు, బళ్ళారి | 1,000 |
| 29. | శ్రీ ఎ. వెంకమ్మ గారు, హైదరాబాద్ | 870 |
| 30. | శ్రీ వై.వి.ఎస్. భాస్కరశర్మ గారు, హైదరాబాద్ | [illegible] |
| 31. | శ్రీ టి. అనురాధ గారు, హైదరాబాద్ | |
| 32. | ఎ.వి.ఎస్. శేషావతారం గారు, హైదరాబాద్ | |
| 33. | శ్రీ పి. మల్లికార్జున్ గారు, హైదరాబాద్ | |
| 34. | శ్రీ జి. రామమూర్తి గారు, బ్రాహ్మణగూడెం | [illegible] |
| 35. | శ్రీ డి. సీతాభాస్కరమ్మ గారు, రాజమండ్రి | 50 |

విరాళములు పంపదలంచినవారు ఈ క్రింది అడ్రసుకు పంపవచ్చును.

సెక్రెటరి, శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి

శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి – 517 640

చిత్తూరు జిల్లా.

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada

**Editor : B. ESWAR**

# నారద భక్తి సూత్రములు–80

## స కీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి అనుభావయతి చ భక్తాన్.

తా॥ అనన్య భక్తితో ప్రేమపూర్వకముగ కీర్తింపబడిన మాత్ర ముచే భగవానుడు శీఘ్రముగ భక్తులకు ప్రకటమగు చున్నాడు. మఱియు వారికి దైవానుభూతి కలుగజేయు చున్నాడు.

వ్యాఖ్య :- భక్తితో, అనన్య ప్రేమతో కీర్తింపబడిన వెంటనే భగవానుడు భక్తులకు ప్రకటమగుచు వారికి ఆత్మజ్ఞానము, బ్రహ్మానుభూతి కలుగజేయుచున్నాడు. భగవద్గీతలోని విభూతి యోగమునందలి ఈ క్రింది శ్లోకము ఇట్టి భావమునే స్పష్టీకరించుచున్నది.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే.

భ.గీ. 10-10

'నిరంతరము ప్రీతిపూర్వకముగ దైవమును భజించు వారికి బుద్ధి యోగమును అనగా ఆత్మజ్ఞానమును, ఆత్మానుభవమును కలుగజేయుదును'- అని గీతా చార్యులు సెలవిచ్చియున్నారు. కాబట్టి ఇక భక్తులు తమకు దైవానుభవము ఎప్పుడు కల్గును?- అను విషయమై సంకోచింప పనిలేదు. వారి హృదయమును భగవానుడు గమనించుచునేయుండి, వారికి కావలసిన ఆత్మ జ్ఞానమును, తద్ద్వారా ఆత్మానుభూతిని కలుగజేయును. అయితే భక్తుడు అనన్యభక్తితో భగవానుని సేవించవలెను.